





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# మూక పంచశతి-కటాక్ష శతకం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000950

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

మూకపంచశతి

# కటాక్షశతకం

మూలము:
మూక మహాకవి

అర్థతాత్పర్య వివరణ
శ్రీ దోర్బల విశ్వనాథశర్మ

ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి



[వెల రూ. 15-00

శ్రీః

శ్రీ చన్ద్రమౌళీశ్వరాయ నమః

శ్రీమత్పరమహంస పరివ్రాజకా చార్యవర్య

జగద్గురు శ్రీ శఙ్కర భగవత్పాదాచార్య పరమ్పరాగతం

శ్రీకామకోటి పీఠ మహాసంస్థానమ్

కాఞ్చీ పురమ్ - 631502

యాత్రాస్థానమ్: తంజనగరీ 19-03-1992

జగన్మాతుః శ్రీ కామాక్షీ దేవ్యాః ప్రసాదభాజన భూతః మూకః కవిర్బభూవ!

కరుణాలయాయాః శ్రీ కామాక్షీదేవ్యాః ప్రభావం - స్వరూప సౌన్దర్యాదికంచ పంచశతేషు శ్లోకేషు వర్ణితవాన్! కటాక్ష శతకాది పంచశతక సమన్వితోయం గ్రంథః మూక పంచశతీ వ్యాఖ్యాయతే!

మంత్రాత్మకస్య - వాఞ్ఛిత ఫలప్రదస్య - అస్య - గ్రన్థస్య - తెలుగు భాషాయాం - వ్యాఖ్యాసహిత ప్రకాశ నార్థం - ప్రయుతతే చీరాలాభిజనః శ్రీ మోహనరావ మహోదయః ఇతి విజ్ఞాయ సుభృశం సంతుష్యామః!

మహదుపకారక మిదం కార్యం శ్రీ కామాక్ష్యాః కటాక్ష వీక్షణేన సుఫలం సఫలంచ భూయా దిత్యాశాస్మహే!

నారాయణస్మృతిః

***

## II

# మండలి మాట

'కవీన్ద్ర హృదయేచరీ పరిగృహీత కాంచీపురీ
నిరూఢ కరుణాఝరీ నిఖిలలోక రక్షాకరీ
మనః పథ దవీయసీ మదన శాసన ప్రేయసీ
మహాగుణ గరీయసీ మమ దృశోఽస్తు నేదీయసీ-'

ఒకప్పుడు కీ.శే. శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు ప్రాసంగికముగా అన్న మాట. "జ్ఞాని మాటాడడు. అజ్ఞాని మాటాడడు. అన్నియు తెలిసిన వాడగుటచే జ్ఞాని యందు, ఏమియు తెలియని వాడగుటచే అజ్ఞాని యందు వాగ్వ్యాపారము నిలిచి పోవును, ఎవరు జ్ఞాన అజ్ఞానముల నడుమ కొట్టు మిట్టాడు చుందురో వారి యందు వాగ్వ్యాపారము అనంతము"- అని. ఇపుడీ మాట దేనికి? అందురేమో తెలుపుచున్నాము 'ఆయన ఎవడో మూగవాడు, అనగా మాటలేనివాడు. ఆయన పంచశతి (500 శ్లోకములు) రచింపగా విపశ్చిదగ్రణులు ఆశ్లోక సముదాయమును దర్శించి తద్గత మహార్థ సౌందర్యమును భావించి - ఆహా! ఇదెంత మధురము! ఇదెంత సుసంగతము! ఇదెంత యపూర్వము! అని శ్లాఘించుచు వాని చుట్టును - పరిభ్రమించుచు వ్యాఖ్యలను రచించు చున్నారు. విమర్శనములను సాగించు చున్నారు.

మూగవాడు మాటాడినాడు కదా! 'జ్ఞాని మాటాడడు, అని అనుకొన్ననాడు మాటాడిన ఈ మూగవానిని జ్ఞాని అనవలెనా? అజ్ఞాని అనవలెనా? అని సందేహము. అట్లే మూకపంచశతీ వ్యాఖ్యాన రచయితలను ఏమనవలెను? అన్నది కూడ సంశయమేకదా! ఆ రెండు సంశయములు ఇటులుండగా-

*శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం నమామిం భగవత్పాద శంకరం లోకే శంకరమ్.* అని కీర్తింపబడిన శ్రీ శంకర భగవత్పాదుల వారి సముద్ర మంత వాఙ్మయము లోకమున విస్తరించి యున్నది కదా! వారినే మనవలెను? అన్న సంశయము - వామనుడు త్రివిక్రముడై ఎదుట నిలిచినట్లు ఆవిర్భవించుచున్నది. మరి ఆ శతావధానుల మాట? అయ్యా! నేను మరి

మాటాడు చున్నాను కదా! వ్రాయు చున్నాను కదా! లోకముతో సంబంధము కలవాడనైయున్నాడను కదా! సర్వంఖల్విదం బ్రహ్మ - నేహ నానాస్తి కిఞ్చన అన్న అనుభూతి యందు పండిన వాడనైనచో ఊ మాటలు ఈ వ్రాతలు ఉండవు కదా! కాగా నేను అజ్ఞానినే కాని జ్ఞానిని కానని వేరే చెప్పనక్కరలేదు కదా! సరి! తెలియని నేను మాటాడిన మూకకవీంద్రునిజ్ఞాని అనవలెనా? కూడదా? అను సందేహమును నివారించుటకు పూనుకొనుట కంటె తెలివిలేమి యుండునా? అయినను నాకు దోచినమాట!

జ్ఞాని బ్రహ్మము తానై జగదుద్ధరణమునకై పలుకును. ఆ పలుకులు వానివి కావు. అచట 'నేను' అనెడి అభిజ్ఞకు తావు లేదు. అతడు అద్వయానంద శిఖరాధి రూఢుడు. ఇతరులో! సంసారమునందున్నవారై అద్వయానంద శిఖరమునధిరోహించిన వారు కారు. వీరు ఆరూఢులు కారు. ఆరు రుక్షువులు. వీరు అహంతా శిఖరాధిరూఢులు. నేను చేయుచున్నాను, నేను పలుకుచున్నాను - అనెడి భావము వీరియందు ప్రబలము. ఇంచుక వివరించు చున్నాను. తన అహంతను పరబ్రహ్మమున విలీన మొనర్చి తదనుభవమున పండిన వాడు జ్ఞాని. వాని యందు 'నేను-నాది' అనెడి భావమే ఉండదు. అందుచే - అచటనుండి వెల్వడిన ఉపదేశ వాక్కునం దాతనికి 'ఇది నా వాక్కు - నారచనము" అన్నభావమెట్లుండును? కాగా అచటి వాక్కు బ్రహ్మవాక్కు! అది వైయక్తికము కాదు! ఇతరులో! తన అనుభవమునకు ఇంకను అందని విషయమును గూర్చి - తన అహంతను (నేను అనెడి భావమును) దృఢముగా నిలువ బెట్టుకొని 'ఇది నా మాట' నా రచన' అనెడి భావముతో నిండిన గుండె కలవారై పల్కుచుందురు. కాగా ఇచటి వాక్కు వైయక్తికము! ఇది అసమగ్రము.

*యస్యదేవే పరాభక్తిః యథా దేవే తథాగురౌ తస్యైతే కథితాహ్యర్థా ప్రకాశన్తే మహాత్మనః* పరాభక్తి యుక్తుడు కావలెను. గురుదైవతమై (గురువే దేవుడుగా గలవాడు) వెలయ వలెను. అపుడు మాత్రమే మూకపంచశతి వంటి గ్రంథముల మహార్థములు సాక్షాత్కారించును. అటులైనచో ఈ వివృతి ఈ వ్యాఖ్య దేనికి? అందురేమో! శ్రీకామాక్షీ మహాదేవిని అనన్య భక్తితో సేవించ వలెను గదా! ఆ భజించు మార్గమును ఈ వివృతి - ఈ వ్యాఖ్య విశదీకరించును. కాగా ఈ వివృతితో - ఈ వ్యాఖ్యతో ఈ శతకమును దన మానసమున నిలుపుకొన్న వాడు శ్రీకామాక్షీ మహాదేవి యొక్క కరుణా

దృగాసారమున సుస్నాతుడై ఇహ పర భోగభాజనుడై ప్రకాశించుటయే కాదు, బ్రహ్మ విద్వరిష్ఠుడై పరిఢవిల్లును ఈ శతకమున కిట్లు పండిత సమ్మతమైన ప్రతిపదార్థ తాత్పర్యములను అనేక విశేషాంశములతో సమకూర్చిన శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారు మహా పండితులు. వారిని సాహిత్యాకాశమునందు ఇపుడిపుడే ఉదయించు చున్న బాల భాను మూర్తిగా భావింతురేమో? అట్లు కాదు. ఉద్దోలమైన పాండితీ వైభవముచే ఉద్గ్రంథరచన చే ఉరుతర విఖ్యాతి నే నాడో గడించుకున్న విద్వత్కవితల్లజులు వారు. వారు రచించిన 'శ్రీలాలిత్యము' ఆంధ్రభాష యందు అనిదంపూర్వమైన ప్రక్రియ. అది అమ్మ మెడనలంకరించిన అమ్లాన పంకజ సహస్రమాలిక. ఇట్టి విద్వాంసులు రచించిన వివృతితో, ఈ కటాక్ష శతకమును - పాదారవింద శతకమును బ్రకటించిన వెంటనే వెలువరించు చున్నందులకు మిక్కిలి ఆనందించు చున్నాము. మూక మహాకవిని మూక వాక సౌందర్యమున దర్శింపగలరు.

ఈ వ్యాఖ్యాన గ్రంథము శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీ స్వామి (శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారి పూర్వాశ్రమ జనకులు) గారికి సమర్పితము.

అన్నిటా సహాయ సహకారాలందించుచూ, చిరునవ్వులొలికించే శ్రీ స్వామి మధుసూదన సరస్వతి (బ్రహ్మవిద్యాశ్రమము, కేశవపట్నం) గారికి నమస్సుమాంజలులు.

సాధన గ్రంథ మండలికి వెన్నెముకగా ఉండి నిరంతరమూ సహాయ సహకారాలందించు నా సోదరుడు శ్రీబులుసు సూర్య ప్రకాశం - "శంకర కింకరుడు" ను ఆయురారోగ్య ఐశ్వర్యాభివద్ధి నొంద ఆశీర్వదించు చున్నాను.

కశ్చాశ్చ మశ్చ నామ్నోక్తాః బ్రహ్మమాధవ శూలినః త్రయో వయం యతో దేవ్యా అక్షిజాతా స్తతః ప్రభోకామాక్షేతి ప్రసిద్ధాస్తు లలితా జననీ చ నః —స్కాందము.

కకారము బ్రహ్మను అకారము హరిని మకారము శివుని దెలుపును. క + అ + మ = కామ. వీరు లలితా పరమేశ్వరి యొక్క అక్షులనుండి (కనులనుండి) ఆవిర్భవించినారు. అందుచే ఆ జగజ్జనని యైన లలిత "కామాక్షి" యను పేర ప్రసిద్ధివహించెను. 'యోవైతాం బ్రహ్మణోవేద అమృతేనా వృతాం పురీం' అని శ్రుతిచే కీర్తింపబడిన బ్రహ్మపురి కాంచీనగరమే

కేశ - బ్రహ్మణా - అంచతేతి కాంచీ. అచట వెలిసిన చూతవృక్షము - వేదమే. దాని నాల్గు కొమ్మలు నాల్గు వేదములు. వేద వేద్యుడైన పరమాత్మయే ఏకామ్రనాథుడు. అనగా ఆయన కామేశ్వరుడే.

కాగా కాశి కంటె విశిష్టమైనది కాంచీనగరమనియు - లలితయే కామాక్షి యనియు, కామేశ్వరుడే ఏకామ్రనాథుడనియు గ్రహించి - శ్రీ కంచి కామకోటి పీఠాధిపతుల ఆశీస్సుల ఫలంగా పుస్తకరూపం సంతరించుకొన్న ఈ స్తుతి యందు బద్ధాదరులై ఎల్లరును మేలందుదురు గాతమని అకాక్షించు చున్నాము.

వట్టి చెరుకూరు వాస్తవ్యులైన శ్రీరావి వెంకట సుబ్బయ్య, సీతారావమ్మల ఆర్థిక సహాయములతో ఈ వ్యాఖ్యాన గ్రంథము ముద్రింపబడినది. వారిని ఆ భగవతి కటాక్షించు గాక.

ప్రూఫు చూచుటయందు సహకరించిన చిరంజీవి శ్రీ వెల్లంపల్లి దాశరథికి శ్రీ కామాక్షీదేవి ఆయురారోగ్య ఐశ్వర్యములు ఇచ్చుగాక.

ఇట్లు,

బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి

తెనాలి

వ్యవస్థాపకుడు

20-05-'95

సాధన గ్రంథ మండలి

# VI

# మూకవాక సౌందర్యము

శ్రీలలితా సహస్రనామ స్తోత్ర పారాయణమును "శివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా" యని ముగించినారు. శ్రీ శంకరులు తమ సౌందర్యలహరి యను స్తోత్ర కావ్యమును "శివశ్శక్త్యా" యని యారంభించినారు.

శ్రీ శంకరులు సుమారేబది శ్లోకములలో శ్రీ దేవి యొక్క శీర్షాది పాదాంత సౌందర్య వర్ణనమును "జయతి కరుణా కాచిదరుణా" యని ముగించినారు. మూక మహాకవి సౌందర్యలహరిలోని యా వర్ణనమును పఠించిన వెంటనే

*'కారణ పర చిద్రూపా కాంచీ పుర సీమ్ని కామ పీఠగతా కాచన విహరతి కరుణా కాశ్మీరస్తబక కోమలాంగలతా'*- అని తమ పంచశతి నారంభించినారు.

శ్రీలలితా సహస్రనామ స్తోత్ర లాలిత్యమునంతను శ్రీ శంకరులు తమ సౌందర్యలహరిలో ప్రతిఫలింప జేసినట్లు మూక మహాకవి శ్రీ శంకరుల సౌందర్యలహరిలోని శ్రీదేవి సౌందర్యమును తన పంచశతిలో ప్రతిఫలింప జేసినారు. వాస్తవమునకు మూక మహాకవి కవితా విషయమున నితరుల ననుకరింపవలసిన భావదారిద్ర్యముకలవాడు కాడు. పైగా తన పంచశతిని పఠించిన వారిలో వందల కొలది మహాకవుల నుద్భవింప జేయు సామర్థ్యము కలిగినవాడు. ఐనను అచ్చటచ్చట శ్రీ శంకరుల ననుకరించుట వారి యెడ గౌరవమును బ్రదర్శించుటకే. కవులు సౌన్దర్యోపాసకులు. వారు మాధుర్యాగమ సంప్రదాయ ప్రవర్తకులు. శృంగార రసబ్రహ్మము వారి మాధుర్యాగమమునకేకైక లక్ష్యము. ఏకైక తాత్పర్యము. శృంగారము స్త్రీ పురుషాద్వైత బ్రహ్మము. సాధారణ వేదాంత పరిభాషలోనది జీవేశ్వరైక్యము. భక్తుల పరిభాషలోనది మధురభక్తి. భగవంతుని స్వపురుషునిగా జేసుకొని స్త్రీ భావమున తమనతని యందు లీనము జేసికొన గలిగిన వారు మధుర భక్త కవులు.. సౌందర్యోపాస కులైన కవులలో జ్ఞానిభక్త కవులుత్కృష్టులు. శ్రీ శంకర మూక మహాకవులట్టివారు.

సౌన్దర్యము ద్వివిధము. ఆంతరంగికము, బహిరంగికము. ఉన్దీక్లేదనే అను ధాతువునకు సు ఉపసర్గ చేర్చి నిష్పన్న మొనర్చిన శబ్దము సున్ద శబ్దము. సున్ద శబ్దమునకు శంకరులు తమ విష్ణుసహస్రనామ భాష్యములో

కరుణ యను యర్థమును చెప్పినారు. ఆ సున్దమును, కరుణను, ఆర్ద్రీ భావమును ఇచ్చునది సుందరి. ఆమె యే జగన్మాత. ఆంతరంగిక సౌందర్యము అనగా కరుణ. కవుల బాహిరంగిక సౌన్దర్యమునభినందించు వారు సాధారణ సహృదయులు. అసాధారణ సహృదయులు జగన్మాత కరుణనుపాసించు మహాకవుల నధికముగా నభినందింతురు. మనమిప్పుడు శ్రీ శంకరుల సౌందర్యమును మూక మహాకవి వాక్కులలో పరిశీలించి దర్శించి యనుభవించెదము గాక! ఆరాధించెదము గాక!

శ్రీ శంకరులు జగన్మాత నరుణ కరుణగా పేర్కొన్నారని యీ వరకే చెప్పుట జరిగినది. ఆమె "శిరీషాభా చిత్తే" (చిత్తమున దిరిసెన పువ్వు వంటిది) యని శంకరులామె చిత్తకోమలతను వర్ణించినారు. మూక మహాకవి ఆమెను" కాశ్మీరస్తబక కోమలాంగలతా" కుంకుమ పూ గుత్తి వంటి కోమలమైన అంగలతగాబేర్కొన్నారు. పూవు మారినదే కాని కోమలత యదే. శంకరులు "కాచిత్" అనగా మూక మహాకవి "కాచన" అనినారు. మూక మహాకవి కారాధ్య దేవత యైన కామాక్షీ దేవి కాలివలె కామేశ్వరి వలె కాది. కాది విద్యారూపిణి ఆమె తమ పంచశతిలోని మొదటిదైన **ఆర్యాశతకము** నందలి మొదటి శ్లోకము ఇదివఱకే ఉదహరింపబడినది. దానిని చూచిన వారి కందలి పాదములన్నియు కాదులని తెలియగలదు. పంచశతిలో మొత్తములో కాది శ్లోకములు కాది పాదములు గణనీయములుగా నున్నవి. ఆర్యా శతకములోని ఈ క్రింది రెండవ శ్లోకములోని పాదములు పదములు కాదులే.

*కంచన కాంచీ తిలకం కరధృత కోదండ బాణసృణి చాపమ్*
*కఠిన స్తన భర నమ్రం కైవల్యానంద కందమవలమ్బే*

దీనికి మూలమనదగిన శంకరుల సౌందర్యలహరి యందలి శ్లోకము కూడకాదియే.

*క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తననతా*
*పరీక్షీణా మధ్యే పరిణత శరచ్చంద్ర వాదనా*
*ధనుర్బాణాన్ పాశంసృణి మపిద ధానా కరతలైః*
*పురస్తాదాస్తాం నః పుర మథితు రాహోపురుషికా*

# VIII

ఈ శ్లోకమందలి మూడవ పాదము పై శ్లోక మందలి రెండవ పాదముగా రూపాంతర మందినది. పై శ్లోక మందలి మూడవ పాదమే శ్లోకమందలి మొదటి పాదములోని రెండవ భాగముగా రూపాంతర మందినది. మొదటి భాగములోని కాంచీ శబ్దము ఆభరణ వాచకముకాగా పై శ్లోకములోని మొదటి పాదములోని కాంచీ శబ్దము నగర వాచకము. రెండింటిలోను కాంచీ శబ్దమున్నది.

శ్రీ శంకరు లరుణకరుణగా నమ్మవారిని పేర్కొన్న శ్లోకము అరాళాకేశేషు అని యారంభింప బడినది. ఆ యెత్తుగడనే స్వీకరించి మూక మహాకవి ఆర్యా శతకములోని నాల్గవ శ్లోకమును రచించినాడు.

కుటిల కచం కఠిన కుచం కుందస్మిత కాంతి కుంకుమచ్ఛాయమ్
కురుతే విహృతిం కాంచ్యాం కుల పర్వత సార్వభౌమ సర్వస్వమ్

ఈ శ్లోకములోని పెక్కు పదములు, పాదములు నాలుగు కాదులే, శంకరుల "అరాళాకేశేషు" అను పదద్వంద్వ మీ శ్లోకమున "కుటిల కచం" అను సమాసముగా మారినది. శంకరులు "దృషదుపల శోభా కుచతటే" అని కుచములలోని కాఠిన్యమును వ్యంగ్యమొనర్పగా నీ శ్లోకమున నా కాఠిన్యము కఠిన కుచం' అని వాచ్యము చేయబడినది. శంకరుల అరుణా అను పదము ఈ శ్లోకమున "కుంకుమచ్ఛాయమ్" అని వివరింప బడినది. పై శంకరుల 'ఆరాళాకేశేషు" అను శ్లోకములోని యెత్తుగడనే గ్రహించి మూక మహాకవి ఆర్యాశతకములో మరొక శ్లోకమును రచించినారు.

'శ్వేతా మన్థరహసితే శాతా మధ్యే చ వాఙ్మనోऽతీతా
శీతాలోచన పాతే స్ఫీతాకుచసీమ్ని శాశ్వతీ మాతా

ఈ శ్లోకములోని యెత్తుగడయే గాక మొత్తము నిర్వహణము శంకరుల శ్లోకమునను సరించి యే యున్నదని వేరుగా చెప్పనక్కఱలేదు. శంకరుల "పరీక్షీణా మధ్యే, భృశంతన్వీమధ్యే" అను పద బంధములే ఈ శ్లోకమందలి శాతా మధ్యే అను పద ద్వంద్వముగా మారిన వనుట గూడ స్పష్టమే. ఈ క్రింది పట్టికను పరిశీలించిన శంకరుల పద బంధములను మూక మహాకవి ఎంతచగా నాదరించినది తెలియ గలదు.

| సౌందర్యలహరి | పంచశతి |
| --- | --- |
| పురారాతే రంతఃపరమసి | - అంతఃపురేణ శంభోః |
| రతినయనలేహ్యేన | - శంభోర్లోచన యుగలేశ లేహ్యామానాయామ్ |
| విశ్వమ్భ్రమయసి పరబ్రహ్మ మహిషి } | భ్రమయసీ కామాక్షీ శాశ్వతీ విశ్వం |
| రవీన్దుస్తనయుగీమ్ | - ఇందురవి మండలకుచా |
| శివాకారే మంచే | - మంచే సదా శివమయే |
| వరత్రాసత్రాణ స్ఫటిక ఘటికా పుస్తక ధరామ్ } | - జపవటి పుస్తక వరాభయకరామ్ |

మూక పంచశతి లోని రెండవ శతకము **పాదారవింద శతకము.** ఇది శిఖరిణీచ్ఛందస్సులో రచింపబడినది. శంకరులు తమ సౌందర్యలహరిని శిఖరిణీచ్ఛందస్సులోనే నిబంధించిరి. శిఖరిణి లహరీ సౌందర్యమున కాలవాలమగుట కుచితమైనది. దీనినే వృత్తౌచిత్యమన వచ్చును. దేవతల మహిమాలహరులు పాదార విందముననే విశేషముగా నెలకొని యుండును. అందుచేతనే మూక మహాకవియు అమ్మవారి పాదార వింద ద్వంద్వమును వర్ణించుచు నీ శతకమును గూర్చినాడు. దీని యందు శంకరుల సౌందర్యలహరీచ్ఛాయలు ఆర్యాశతకము నందు కంటె నెక్కుడుగా నున్నవి. శ్రీ శంకరు లమ్మవారి పాదారవిందముల నారేడు శ్లోకములలో వర్ణించిరి. పాదేతరావయవముల వర్ణించునప్పుడు కూడ సౌందర్యలహరుల ప్రవహింప జేసినారు. వాని యనుకరణములు మూక కవి పాదారవింద శతకమున బుష్కలముగానే యున్నవి. భవన కలహంసము లమ్మవారి పదన్యాస క్రీడతో పరిచయమును సంపాదింప దలచి వాని నాశ్రయింపగా నమ్మవారి పాదము మంజీర రణితచ్ఛలా దాచక్షాణమ్" అని మంజీర నాదము అను మిషతో హంసములకు శిక్షణమునే భంగ్యంతరముగా మూక మహాకవి "విరావైర్మాంజీరైః కిమపి కథయన్తీవ మధురమ్" అని వివరించినారు. ఇంతేగాక "మరాలీనాం యానాభ్యసన కలనామూల గురవే" అని శంకరులుపై భావమునే వివరించినారు. శంకరులు అమ్మవారి పాదముల వర్ణించుచు "దరిద్రేభ్యో భద్రాం శ్రియ మనిశ మహ్నాయ దదతౌ" అని చెప్పగా నదే యెత్తుగడతో మూక మహాకవి "దరిద్రాణాంత్రాణ వ్యతికర సురోద్యాన తరవే" అని చెప్పినాడు. శంకరులు "యదభిహిననాయ స్పృహయతే" అనగా మూక మహాకవి చరణ నలినాయ స్పృహయతే అని అదే స్పృహ ధాతువును

ప్రయోగించినాడు. ఇట్లే మరొక చోట 'అరుణమ్నే స్పృహయతే" అని ప్రయోగించినాడు. శ్రీ శంకరులు శివుని నెత్తిపై గంగయున్నదని గౌరి యలిగినప్పుడిదిగో నీ పాదములకిది పాద్యమని చెప్పి శివుడు ఆమె యలకను దీర్చుటకామె పాదములపై గంగను గ్రుమ్మరించినట్లు "యయోః పాద్యం పాదః" అని చెప్పగా మూక మహాకవి స్మరారాతే ర్చూడా నియతి గృహమేధీ హిమకరో యయోస్సాంధ్యాంకాంతిం వహతి అశివ జటా జూట గత చంద్రుడు పాదముల కాంతిలో నెఱ్ఱబడి నట్లు వర్ణించినాడు. ఇరువురును అమ్మవారి పాదములకు శివుడు మోకరిల్లుటనే వర్ణించినారు. శ్రీ శంకరులమ్మవారి సీమంతమును వర్ణించుచు "వహన్తీ సిన్దూరమ్ ప్రబల కబరీ - భారతిమిర! త్విషామ్ బృన్దైర్బన్దీ కృతమివ నవీనార్క కిరణమ్"- అందలి సిన్దూరమును తిమిర బృందముచే బంధింప బడిన నవీనార్క కిరణమును గానుత్ప్రేక్షింపగా మూక మహాకవియునదే యెత్తుగడతో

'వహన్తీం సైందూరీం సరణి మివ నమ్రామరపురీ
పురన్ధ్రీ సీమంతే కలికమల బాలార్క సుషమా'-

అమరపురీ పురన్ధ్రీ సీమంత సిందూర సరణిని వహించి బాలార్కశోభను వెలార్చు నమ్మవారి పద నలిన కాంతిని వర్ణించినాడు. ఇందలి సరణి శబ్దము కూడ శంకరుల శ్లోకము లోనిదే. ఆర్యా శతకమున శంకరుల పద బంధములను మూకకవి యనుకరించిన పట్టిక వంటి మరొక పట్టిక ఈ క్రింద నీయబడినది. అది పరిశీలించిన మరికొన్ని అనుకరణములు కాననగును. ఇవి యన్నియు పాదారవింద శతకమునకు సంబంధించినవే.

| సౌందర్యలహరి | మూకపంచశతి |
|---|---|
| తులాకోటి క్వాణైః | - తులాకోటి ద్వంద్వక్వణిత |
| పవిత్రీకర్తుం నః | - పవిత్రీకుర్యుర్నః |
| కదాకాలే మాతః | - కదాదూరీ కర్తుమ్; కదాహం లప్స్యేతే |
| కవీన్ద్రాణాం చేతః | - కవీనాం చేతో; కవీన్ద్రాణాం నానా |
| పరిహసతిపంకేరుహరుచిమ్ | - పయోజం కామాక్ష్యాః పరిహసతి |
| అవిశ్రాంతం పత్యుః | - అవిశ్రాంతం పంకే; అవిశ్రాంతం తిష్ఠన్ |
| పురసాదాస్తాంనః | - పురస్తాత్కామాక్షీ! |

| | |
|---|---|
| దరిద్రాణాం చింతామణి గుణనికా | - దరిద్రాణామ్మధ్యే |
| జయత్యంబస్తంబేరమ | - జయత్యంబ శ్రీమన్నఖ |
| నదఃశోణో | - నదః శోణాభిఖ్యో |
| జడానాం చైతన్య | - జడానమప్యంబ |
| అహస్సూతే సర్వమ్ | - యశస్సూతే మాతః |
| పురమథితురాహోపురుషికా | - భణితు మాహోపురుషికామ్ |
| మాహేన్ద్రీ వితతి | - మాహేన్ద్రీం కకుభమివ |
| ప్రణత జన సౌభాగ్య జననీమ్ | - అమర తరుదౌర్భాగ్య జననీమ్ |

శ్రీ శంకరులు పాదముల వర్ణనమును ముగించుచు "తవాస్మిన్ మన్దార స్తబక సుభగేయాతు చరణే! నిమజ్జన్మజ్జీవః కరణ చరణైః షట్చరణ తామ్" -(తన జీవుని అమ్మవారి మన్దార స్తబక సుభగమైన చరణమున, షట్చరణ త్వమును పొందుగాక) యని ప్రార్థింపగా మూక మహాకవి పాదారవింద శతకములోని తొంబది నాల్గవ శ్లోకమున

'మనోభృంగోమత్కః పదకమల యుగ్మే జననితే ........... రమతామ్'

అని అమ్మవారి పదకమల యుగ్మమున తన మనో భృంగము రమించు గాక యని ప్రార్థించినారు. ఇంతే గాక "దధానో మన్దార స్తబక పరిపాటీమ్" అని శంకరులు ప్రయోగించిన మందార స్తబక శబ్దమునే ప్రయోగించినాడు. ఇంక కొన్ని చోట్లను మందార స్తబక శబ్దమునే ప్రయోగించి శ్రీ శంకర ప్రయోగమందాదరమును ప్రదర్శించెను.

శ్రీ శంకరులు తమ సౌందర్యలహరి పూర్వభాగమున మూలాధారాది షట్కమలములలో ధ్యేయమైన శివ సహిత యగు నమ్మవారిని స్తుతించి చివఱకు సహస్రారగత శివ చంద్రామృత రసముచే సమస్త దేహము ప్లావితమగుటను వర్ణించినారు. మూక మహాకవియు మూడవదైన తమ స్తుతిశతకమున

'ప్రదలిత షడాధార కమలాం చరన్తీం
సౌషుమ్నేపథి పరపదేన్దు ప్రవిగలత్సుధాం'

అని శంకరుల వర్ణనమును సంగ్రహించినారు. పై రెండు శతకములందు వలెనే ఈ స్తుతి శతకమందును. శంకరుల యను కరణముల నెన్నింటినో ఈ క్రింది పట్టిక యందు గమనింపవచ్చును.

| సౌన్దర్యలహరి | పంచశతి |
|---|---|
| కుచాభ్యా మానమ్రమ్ | - స్త నాభ్యామానమ్రా |
| గోత్రాధరపతి కులోత్తంసకలికే | - నిగమముకుటోత్తంసకలికే |
| తుహినగిరి వంశ ధ్వజపటి | - విషమ శరవీరధ్వజపటి జనని |
| మయి దృష్టిస్స కరుణా | - జనని మయి కామాక్షి కరుణా |
| పురస్తాదాస్తాం నః | - పురస్తాన్మే భూయః |
| నగపతిపతాకే | - హిమగిరి పతాకే |
| హరమహిషితేమన్మథకలామ్ | - హరమహిషి సస్యాంకురుమసౌ |
| కుటిల శశి చూడాల ముకుటమ్ | - కరముకుల చూడాల ముకుటా |
| నమో వాకమ్ బ్రూమః | - నమో వాకమ్ బ్రూయుః |
| జహిజమ్భారి మకుటమ్ | - జంభారాతి ప్రభృతి ముకుటీః |
| కలత్రం వైధాత్రమ్ | - శాంకరం తత్కలత్రమ్ |
| వాణీం వీణా | - వాణీ వేణీ |
| క్వణత్కాంచీదామా | - క్వణ త్కాంచీ కాంచీ |

శ్రీ శంకరులు తమ సౌన్దర్యలహరిలో చివఱ "ప్రకృత్యామూకానామపిచ కవితా కారణతయా" అని మూగల చేత గూడ అమ్మవారు కవిత్వమును చెప్పింప గల్గరని చెప్పగా మరింత అందముగా మూక మహాకవి 'మూకానామపి కుర్వతీ సురధునీ నీకాశ వాగ్వైభవమ్ - ఆకాశ గంగా సమాన వాగ్వైభవము నమ్మవారు మూగలకు కూడ కలిగించెదరని చెప్పినాడు.

నాల్గవదైన కటాక్ష శతకము యొక్క ఆరంభమున గూడ మూక మహాకవి "మూకాత్మనామపి మహాకవితా వదాన్యాన్" - మూగలకు గూడ మహాకవిత్వము నమ్మవారి చూపులు ప్రసాదించుననని చెప్పినాడు.

శ్రీ శంరులమ్మవారి కన్నులను ఏడెనిమిది శ్లోకములలో వర్ణించినారు. కటాక్ష శతకమున వానిలోని భావములతోడి సామ్యము కనిపించును. శ్రీ శంకరులు "అహస్సూతే సవ్యం తవ నయన మర్కాత్మకతయా త్రియామాం వామాతే సృజతి రజనీ నాయకతయా"- అని అమ్మవారి కన్నులను అహర్జనక

సూర్యాత్మకముగా రాత్రి జనక చంద్రాత్మకముగా వర్ణించినారు. మూక మహాకవి అదే భావమును" నక్తందిన ప్రసవ భూనయనాభవంతి" అమ్మవారి భక్తులు రాత్రిందిన జనక నయనములు గల వారగుదురని పర్యాయోక్తాలంకార రూపమున సంగ్రహించినాడు. శంకరులు వర్ణించిన సంధ్యాజనక వహ్న్యాత్మక తృతీయ నేత్రమును బేర్కొనలేదు. కామాక్షీ దేవి విగ్రహమున తృతీయ నేత్రము కానరాకుండుట కారణముగా దానిని బేర్కొని యుండక పోవచ్చును. "నిలీయన్తే తో యేనియత మనిమేషా శ్శ ఫరికాః" అమి శంకరులు అమ్మవారి కంటి సౌందర్యమునకోడి చేపలునీట మునిగి యున్నవని యవి యనిమేషములైన వని యుత్ప్రేక్షింపగా మూకమహాకవి శివశిరముపై నున్న మన్దాకిని పై గల కోపముతో అమ్మవారి కటాక్షము కుటిలముగా తిరుగు చేపయా? యని సందేహించినారు. శంకరులు త్ప్రేక్షాలంకారమును మూక మహాకవి సందేహాలంకారమును నయన శోభాహేతువులుగా గూర్చినారు.

*'దృశాద్రాఘీ యస్యాదర దలిత నీలోత్పల రుచా*
*దవియాం సందీనం స్నపయకృపయా మామపిశివే'*

అని శంకరులు అరవిరిసిన నల్లని కలువ కాంతి వంటి కాంతి గలనీ పొడవైన చూపుచే దూరముగా నున్న దీనుడనైన నన్ను గూడ గృపతో దడిపి వేయుమని ప్రార్థింపగా "మాతః క్షణం స్నపయ మాంతవ వీక్షణేన" అని మూక మహాకవి అమ్మా! నీ చూపుతో క్షణమాత్ర కాలమైనను దడిపి వేయుమని ప్రార్థించినాడు. మరొక చోట "విదలితోత్పల చాతురీణాం నిందాంకురః" వికసించిన కలువల చాతుర్యములకు నిందాం కురమమ్మవారి కటాక్షమని చెప్పినాడు. ఇరువురును అమ్మవారి చూపును కలువతో బోల్చియున్నారు. శంకరుల పైశ్లోక ప్రథమ పాదములోని "దరగలిత నీలోత్పల రుచా" అను దృగ్విశేషణము యొక్క యర్థమునే మూక మహాకవి "నీలోత్పలం నిజ సమీప నివాసలోలమ్ ప్రీత్యైవ పాఠయతి వీక్షణ దేవి కేన్దః"- తనకడ (చెవిపైన) శిష్యుడుగానున్న నీలోత్పలమునకు అమ్మవారి కటాక్షమనెడి గురుస్వామి కాలిమ సంప్రదాయమును నేర్పుచున్నట్లున్నదను నుత్ప్రేక్షతో నలంకరించినాడు.

'ఇయంచ శ్రీర్బద్ధచ్ఛాదక పాటం కువలయం
జహాతి ప్రత్యూషేనిశాన విఘటయ్య ప్రవిశతి'

అని శంకరులు చెప్పిన భావమునే మూక మహాకవి "దినేషు ప్రమ్లానతాం కువలయమ్ ప్రకటీ కరోతి",- పగళ్ళలో కలువ తన మ్లానతను ప్రకటించు చున్నది అని భంగ్యంతరముగా ప్రకటించినాడు. శంకరులొక చోట అమ్మవారి చూపును హేమాంబుజ రుచిః (బంగారు కమలము యొక్క కాంతి వంటి కాంతి గలది) అని పేర్కొన్నారు. దాని యర్థమునే మూక మహాకవి

'నీలాలకా మధు కరన్తి మనోజ్ఞ నాసా
ముక్తారుచః ప్రకట కన్ద బిసాంకురన్తి
కారుణ్యమంబ మకరన్దయతి కామకోటి
మన్యేతతః కమల మేవ విలోచనం తే'

(ఓ కామకోటీ! కామాక్షీ నల్లని ముంగురులు తుమ్మెదలైనీ నాసాభరణ ముక్తా కాంతులు బిసాంకురములై నీ దయ మకరన్దమై యుండుటచే నీ కన్ను కమలమే యని తలచు చున్నాను) అని ఉత్ప్రేక్షాలంకారముతో నలంకరించి విస్తరించినాడు. శంకరులమ్మవారి తృతీయ నేత్ర మగ్నిరూపము కావున హేమాంబుజ మన్నారు. మూక మహాకవి కామాక్షి యందు తృతీయ నేత్రము దర్శింపబడకుండుటచే సాధారణ కమలముగా నుత్ప్రేక్షించినాడు. శ్రీ శంకర మూక మహాకవులిరువురు అమ్మవారిని తమ జూపులతో తమను దడుపు మని ప్రార్థించినారని ఇంతకు ముందే చెప్పబడినది.

మూక మహాకవి ఐదవ దైన మన్దస్మిత శతకము నందు మన్దహాసముతో 'నను దడుపుమని ఈ క్రింది శ్లోకమున

'క్రమేణ స్నపయస్వకర్మకుహనా చోరేణ మారాగమ
వ్యాఖ్యా శిక్షణ దీక్షితేన విదుషా మక్షీణ లక్ష్మీపుషా

కామాక్షి! స్మిత కన్దలేన కలుషస్ఫోటక్రియా చుంచునా కారుణ్యామృత వీచికా విహారణ ప్రాచుర్య ధుర్యేణమామ్ (కర్మను దొంగిలించు, మన్మధాగమమును వ్యాఖ్యానించుటకు నేర్పుటకు దీక్ష వహించిన, క్షీణించని పాండిత్యముగల వారితో కాంతినింపగల, పాపములను పగులగొట్టు కర్మ యందు సమర్థమైన, దయామృత తరంగములలో దేలియాడు, నీ చిరునవ్వుతో నన్ను దడుపుము) అని ప్రార్థించినాడు. శ్రీ శంకరులు తమ సౌందర్యలహరిలో

నొక చోట అమృతము ద్రావియు దేవతలు మరణించు వారే కాని ఓ యమ్మ! నీ భర్త విషము ద్రావియు మరణము లేక యున్నాడు. ఇది నీ తాటంక మహిమ యని చెప్పినారు. ఈ భావమునే మూక మహాకవి

'సాహాయ్యం కలశాంబుధేర్వహతితే కామాక్షి మన్దస్మితం
శోభామోష్ఠ రుచాంచ విభ్రమ భు వామేతద్భిదామ్ బ్రూమహే
ఏతస్మాదుదితం పురాకిల పపౌశర్వః పురాణః పుమా
నే తన్మధ్యసముద్భవాం రసయతే మాధుర్య రూపాంసుధామ్

(ఓ కామాక్షీ! నీ మన్దస్మితము పాలసముద్రమునకు సాయమొనరించు చున్నది. విలాసముల జన్మభూములైన పెదవుల కాంతిని ధరించు చున్నది. పూర్వము పురాణ పురుషుడైన శివుడు ఆ పాలసముద్రము నుండి పుట్టిన యమృతముద్రావెనట, అదిపాతకథ, తృప్తినందక నీ పెదవుల మధ్య నుండి జనించు మాధుర్య రూప సుధను నిరంతరము ఆస్వాదించు చున్నాడు. ఇది వర్తమాన కథ) అని అమృతము కన్నను అమ్మవారి పెదవుల మధ్య జనించు సుధ యొక్క విశిష్టతను చెప్పుచునే విషమును ద్రావి యుండుట తద్దోష పరిహారార్ధ మిప్పుడధర సుధను ద్రాగుట మనోహరముగ వర్ణించి విషము అమృతము రెండు పాల సముద్రము నుండి పుట్టి యుండవచ్చును. కానీ అమ్మ వారి మన్దస్మితము నుండి సుధయే జనించును గాని విషము జనించదు. అని వ్యంజింప జేయుచు మందస్మిత మహిమను ధ్వనింపజేయుచు తాటంక మహిమ కంటె మన్దస్మిత మహిమ గొప్పదియని సింగారించుచున్నాడు. పాలసముద్రములో జన్మించిన అమృతము నితర దేవతలతో బాటు శివుడు త్రావినను అది సాధారణమే కాని అసాధారణము కాదు. అమ్మవారి పెదవుల మధ్య నుండి జనించిన సుధ మాత్రము శివునకు మాత్రమే లభించినదగుట నిది యసాధారణము. అమృతము విషము పాల సముద్రములోనే జనించుటచే దేని కదే గుణమును దోషమును ప్రసాదించునే కాని యొక దాని ప్రభావము నింకొకటి పోగొట్ట జాలక పోవచ్చును. అని తలచి శివుడీ మందస్మిత క్షీర సముద్ర మధ్య జనితాధర సుధను ద్రావినాడు. తాటంక మహిమనెఱిగి ద్రావినాడు. తాటంక మహిమ మృత్యునివారకమైనదే. అయినను నీ మందస్మిత క్షీర సముద్ర జనితాధర సుధకున్న మాధుర్య మహిమ దానికి లేదు. ఈ పారవశ్యమును గల్గించు శక్తి దానికి లేదు.

మృత్యుంజయత్వము గొప్పదే కాని యది యానంద రూపము కాదు. అమ్మవారి యధర సుధ ఆనంద దాయకమని మూక కవి సింగారించుటలోని శృగార రసమాస్వాదింప దగినది.సాధారణామృతము నిచ్చు పాల సముద్రము కన్న అసాధారణ సుధ నొసగు మన్దస్మితము గొప్పది అని తాత్పర్యము. శ్రీ శంకరులు తమ సౌన్దర్యలహరిలో అమృతలహరి, ఆహ్లాదలహరి, ఆనన్ద లహరి, సౌన్దర్యలహరి అను లహర్యంత పదములను ప్రయోగించినారు. మూక మహాకవి గూడ ఇట్టి లహర్యంత పదముల బెక్కింటి బ్రయోగించినాడు. ఈ మన్దస్మిత శతకమున గూడ "మందస్మిత జ్యోతిషాం లహరీ" అని ప్రయోగించినాడు. శంకరుల వలె సమూహార్థకనికురుంబ శబ్దమును ఓష్ఠ శ్రీనికురుంబ పల్లవపుటే అని మూక మహాకవియు ప్రయోగించినాడు. శంకరులు "బహిరపి సముక్తామణిధరః" అని ముక్తామణిధరమైన నాసికను వర్ణించగా మూకమహాకవి "నాసాగ్రముక్తామణిః" యని ప్రయోగించినాడు. శ్రీ శంకరులమ్మవారి ముఖమును వర్ణించుచు అమ్మవారి ముఖ చంద్రస్మిత జ్యోత్స్నాపాన మాధుర్యాతిశయముచే చకోరములకు చంచు జడిమ ప్రాప్తముకాగా కొంచెము పులుపు నంజుకొని దానిని తగ్గించు కొనుటకై పుల్లనైన చంద్రామృత లహరిని పులిసిన గంజి యనుబుద్ధితో నా చకోరములు త్రాగినవని చెప్పి అమ్మవారి ముఖము చంద్రుని మించిన కాంతి గలదని వ్యంజింపజేయగా మూక మహాకవియు "బింబంచాంద్రమసంచ వంచయతి యాగర్వేణ సతాదృశీ కామాక్షి! స్మిత మంజరీ" (స్మిత మంజరి చంద్ర బింబమును వంచించు చున్నది) అని అమ్మవారి స్మితమంజరి చంద్రకాంతి నతిశయించుటను వ్యంజింప జేసినాడు. శంకరుల దృష్టిలో చకోరములనగా శివాది సాధువులు లేక వారి మనస్సులు కావచ్చును. మనమూహించుకొన వలసినదే కాని స్పష్టము చేయలేదు. అమ్మవారి ముఖ చంద్రజ్యోత్స్నలో వీరు తరు నీల పీతాది వర్ణముల వదలి శ్వైత్యమునే పొందుదురు. శుద్ధ సాత్త్వికత్వమునే పొందుదురు.

'వక్త్రేన్దోస్తవ చన్ద్రికా స్మిత రుచిర్వల్గు స్ఫురన్తీ సతాం
స్వాచ్ఛేద్వ్యక్త మిదం చకోర మనసాం కామాక్షి! కౌతుహలమ్'

అని మూక మహాకవి ఆ చకోరములు సత్పురుష మనస్సులే యని స్పష్టము చేసినాడు. ముఖచన్ద్ర జ్యోత్స్నను చకోరము లాస్వాదించుట యసంభావ్యము కదా! మూకమహాకవి వాక్కులలో కానవచ్చు సౌందర్యము ఇట్లు ప్రదర్శింపబడినది.



# శ్రీ కామాక్ష్యైనమః

మోహాన్ధ కార నివహం వినిహన్తు మీడే
మూకాత్మనామపి మహాకవితావదాన్యాన్
శ్రీ కాంచిదేశ శిశిరీకృతి జాగరూకా
నేకామ్రనాథ తరుణీ కరుణావలోకాన్

అ|| శ్రీకాంచిదేశ - శ్రీకాంచీనగర ప్రాంతము యొక్క, శిశిరీకృతి - చల్లబరచుటయందు, జాగరూకాన్ - మేల్కొనియుండునట్టి, మూకాత్మనామ్ అపి - మూగవోయిన మనస్సు కలవారికైనను, మహాకవితావదాన్యాన్ - మహాకవిత్వమును ప్రసాదించునట్టి, ఏకామ్రనాథ - ఏకామ్రేశ్వరుని యొక్క, తరుణీ - భార్య యయిన శ్రీ కామాక్షీదేవి యొక్క, కరుణావలోకాన్ - దయతోకూడిన చూపులను మోహాన్ధకారనివహమ్ - మోహమనెడి చీకట్ల రాశిని, వినిహన్తుమ్ - నశింపజేయ, ఈడే - స్తుతించెదను.

తా|| శ్రీ కాంచీనగర ప్రాంతమును చల్లబఱచు నట్టివి శ్రీ కామాక్షీ కరుణావలోకములు - అవి మూగవారికిని మహాకవిత్వము నొసగును. నా మోహాంధకార రాశిని దొలగించ వానిని స్తుతించెదను.

వి|| భూమండలమందలి అన్ని ద్వీపములును సముద్రముచే చుట్టబడియుండును. భూదేవికి సముద్రమే కాంచియైయుండును. శ్రీ కామాక్షికి సర్వబ్రహ్మాండములు కాంచీ కింకిణీరూపములే. ఆమే బ్రహ్మాండనగరనాయిక. బ్రహ్మాండములనన్నిటిని తనలో నిముడ్చుకొన్న మహాకాశము ఆమెకు అంబరము. నడుముపైనున్న పీతాంబరము నొడ్డాణముతో బిగింపవచ్చును. కాంచీనగరమిట సర్వబ్రహ్మాండోపలక్షకము. సర్వబ్రహ్మాండముల కాధారమైన తననగరము కాంచియని పిలువబడుచు భారత దక్షిణ ప్రాంతమున విరాజిల్లుచున్నది. ఆ కాంచీనగర నాయకుని ప్రాంతమున నున్న యొక శివలింగము దగ్గఱగా ఒక మామిడి చెట్టుండుటచే నేకామ్రనాథ నామము కలిగినది. ఏకామ్రనాథ నాముడైన శివునకు కామాక్షీ నామముకల దేవి భార్య. కామాక్షీ నామమున కన్నుల

ప్రాధాన్యము కనబడును. మూకమహాకవి వ్రాసిన పంచశతిలోని ఐదు శతకములలో కటాక్షశతకము ముఖ్యము. కటాక్షమామెదే, ఆమె కన్నులలోనిదే. అదియే మూక మహాకవిచే నైదు శతకముల రచింపజేసినది. అక్షి ప్రాధాన్య సూచక కామాక్షీ శబ్దప్రతిపాద్యదేవతా కటాక్ష ప్రాముఖ్యమే కటాక్ష శతకము ప్రతిపాదించుచున్నది. సర్వేంద్రియాణామ్ నయనం ప్రధానమ్ అన్నంత మాత్రమున మిగిలిన యింద్రియముల యావశ్యకత నివారింపబడదు. మిగిలిన శతకములున్నప్పుడే దీనికి ప్రాధాన్యము లభించును. విగ్రహమునందు పాదముఖములే అనాచ్ఛాదితములు. భక్తుల యుపాసనలకు లక్ష్యములగుట యుపపన్నము. రెండవ శతకమున పాదద్వంద్వ ముపాసింపబడినది. ముఖమునందు పాసింపదగినవి కటాక్షమందస్మితములు. కటాక్షము కలిగినందుక సూచనగా పెదవులపై దరహాసమంకురించును. కావున మందస్మిత శతకమిందు చివరదైనది. కటాక్షము మందస్మితమునకు ముందుండవలసినది అట్లేయున్నది. ఇంద్రియములలో కన్నులు తైజసములు. అజ్ఞానమోహాద్యంధకార ప్రభేదముల నివారణమున కవియే యుపయుక్తములగును. కావుననే మూకమహాకవి యాప్రథమ శ్లోకమున మోహాన్ధకార నివహ వినిహననమునకై శ్రీ కామాక్షీ దేవి యొక్క కరుణావలోకములను బ్రార్థించు చున్నాడు. పరికరాంకు రాలకారధ్వని యీ శ్లోకమునందున్నది. జాగరూకాన్, కరుణావలోకాన్ అనిముగియు నుత్తరార్థ పాదాంతములలో అంత్యాను ప్రాసయున్నది. మూకా, శ్రీకా, ఏకా అని 2,3,4 పాదముల ఆదిలోనుండుటచే నాద్యనుప్రాసము. హాక, రకృ, ణీక మధ్యలో నుండుటచే మధ్యానుప్రాసము అను శబ్దాలంకారములున్నవి. ఈ శతకమున వసంతతిలకవృత్త ముపయోగింపబడినది. ఇందు "తభజజగగ" అనుగణములుండును వసంత ముఖమునకు భ్రమరము తిలకము ఆవదగును. కటాక్ష భ్రమరౌపమ్యము ప్రసిద్ధమగుటచే కటాక్షవర్ణనమున వసంతతిలకవృత్తముపయోగించుటచే వృత్తౌ చిత్య శోభితమీశతకము.

2. మాతర్జయన్తి మమతాగ్రహ మోక్షణాని
మాహేంద్రనీల రుచి శిక్షణ దక్షిణాని

కామాక్షి కల్పిత జగత్త్రయ రక్షణాని
త్వద్వీక్షణాని వరదాన విచక్షణాని

అ|| మాతః - తల్లీ!, కామాక్షి - కామాక్షీ!, మమతాగ్రహ మోక్షణాని - మమకారమనెడి దయ్యమునుండి విడిపించునట్టి, మాహేంద్రనీల - ఇంద్రనీల మణులయొక్క, రుచి - కాంతిని, శిక్షణ - శిక్షించుట యందు, దక్షిణాని - సమర్థములైన, కల్పిత - కల్పింపబడిన, జగత్త్రయ - మూడులోకములయొక్క, రక్షణాని - రక్షణముగల, వరదాన విచక్షణాని - వరముల నిచ్చుటయందు నేర్పుగల, త్వద్వీక్షణాని - నీచూపులు, జయంతి - సర్వోత్కృష్టముగా వర్ధిల్లుచున్నవి.

తా|| ఓ తల్లీ! కామాక్షీ! నీ చూపులు, నన్ను లేక అందఱను పట్టిన మమకారమనెడి దయ్యమునుండి విడిపించగల్గునవి. ఇంద్రనీల మణుల కాంతిని శిక్షించుటలో, ముల్లోకములకు రక్షణమును కల్పించుటలో, వరములిచ్చుటలో, సమర్థములైనవి.

వి|| మొదటిశ్లోకమున మోహమంధకారముగా రూపొందింపబడి దాని నాశము ప్రార్థింపబడినది. అజ్ఞానమందలి ఆవరణ శక్తి మోహమనబడును. ఉన్నవస్తువును కన్పింపకుండగప్పి వేయునది మోహము కావుననది యావరణశక్తి. దీనవలన స్వకీయులు పరకీయులునను భేదభావముత్పన్నమై ఒకే ఆత్మ కొందరు తనవారుగా కొందఱు తన వారుకాని వారుగా బహుత్వమును బొందును. వీరు తనవారు (ఇవి తనవి) అను భావమే మమకారమని పేర్కొన బడును. ఈ మమకారమొక దయ్యమువలె మనచే వికృతచేష్టల చేయించును. అమ్మవారి చూపులాదయ్యమునుండి విముక్తి కలిగించునని యీ శ్లోకమున జెప్పబడినది. ఈశ్వరత్వ వ్యవస్థాపకములైన నాలుగు కర్మలీ శ్లోకమున జెప్పబడినవి. మోక్షణము - మమకారము నుండి విడిపించుట. జీవులను సంసార బంధము నుండి విడిపించుటయే. మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే అనుసూక్తి యిందుకు ప్రమాణము. శిక్షణము - ఇంద్రనీల మణుల కాంతులు అర్హత లేకున్నను దేవి చూపులతో సామ్యమును, ఐక్యమును పొందగోరుటచే వానిని శిక్షించుచున్నవా యమ్మ చూపులు. అహంకారము

వీడనివాడు స్థూల సూక్ష్మ కారణ శరీరములు నేననుకొనుచునే ఈశ్వరోహమని భావించును. ఇటువంటి వానిని గీతనిందించినది. ఈశ్వరోహమహంభోగీ సిద్ధోహం బలవాన్సుఖీ - అధ్యాయము 16 - శ్లోకము14' దుష్టులైన రాక్షసులందఱు ఈ కారణముననే శిక్షింపబడినారు. నేటికిని అప్పుడప్పుడు దుష్టులేదో విధమున నీశ్వరునిచే శిక్షింపబడుచునే యున్నారు. అర్హతకలవాడు ఈశ్వరునితో నైక్యము ననుసంధించుట శాస్త్రసమ్మతమే. రక్షణము - దుష్ట శిక్షణముతోబాటు శిష్ట రక్షణము ఈశ్వర కృత్యమే. అమ్మ కనులు ముల్లోకముల రక్షించుచున్నవి, వరదానము - జీవుల కిహ పరలోకములలో కూడ సుఖములు కావలయును. దీనికభ్యుదయమను పేరు. దానిని కూడ ఈశ్వరుడే వివిధదేవతోపాసకులకు వారిద్వారా స్వోపాసకులకు స్వయముగా ప్రసాదించును కావున నిదియు నీశ్వరకృత్యమే. 'ణాని' అనినాలుగు పాదములచివఱ నుండుటచే నీశ్లోకమున నంత్యాను ప్రాసాలంకారము కలదు. కన్నులకు సమానములు కాదగిన ఇంద్రనీల మణుల కాంతులను శిక్షించుచున్నదని ఉపమాననింద వ్యంగ్యమగుచుండుటచే ఈ శ్లోకమునందలి అలంకారము ప్రతీపము.

3. ఆనంగ తంత్రవిధిదర్శిత కౌశలానా
మానందమంద పరిఘూర్ణిత మన్థరాణామ్
తారల్య మంబ తవతాడిత కర్ణసీమ్నాం
కామాక్షి! ఖేలతి కటాక్ష నిరీక్షణానామ్

అ|| అంబ - తల్లీ!, కామాక్షి - కామాక్షీ!, ఆనంగ తంత్రవిధి - మన్మథ తంత్రవిధాన మందు, దర్శిత - చూపబడిన, కౌశలానామ్ - నేర్పుగల, పరిఘూర్ణిత - తిరుగుటచేత, మంథరాణామ్ - అలసములైన, తాడితకర్ణసీమ్నామ్ - తాకిన చెవుల హద్దుగల, తవ - నీయొక్క, కటాక్షనిరీక్షణానామ్ - క్రీగంటి చూపులయొక్క, తారల్యమ్ - చంచలిత, ఖేలతి - ఆడుచున్నది.

తా|| అమ్మా! నీ చూపులు మన్మథ తంత్ర విధానమును ప్రదర్శించినవి. వానిలో ఆనందము మెల్లగా సుడి తిరుగుటచే కదలికలలో వేగము కోల్పోయినవి. అవి కర్ణాంతము వ్యాపించినవి. అట్టి నీచూపులలో చాంచల్యము ఆడుకొను చున్నది.

వి|| భర్తయైన శివునాకర్షించుటకు నీ కన్నులు మన్మథ తంత్ర విధానము ననుసరించి శృంగారవిలాసములను ప్రదర్శించుచుండును. కామునకు అనంగుడను పేరుగలదు కావున కామశాస్త్రమునకు అనంగ తంత్రమను పేరు వచ్చినది. అంతరంగమునందు పుట్టు కామునకు అంగములేదు. విష్వంగమునందు బుట్టిన అంగజుని అంగము శివునిచే కాల్పబడినది కావున కామునకు అనంగుడనుపేరు వచ్చినది. "సోఽకామయత" అనునుపనిషద్వాక్యానుసారము ఈశ్వరుని బహుభవన సంకల్పమే కాముడు. స్త్రీ పురుషులిద్దఱు. వారిని ముగ్గుఱిని చేయుటకు వారి అంతరంగములలో కాముడుద్భవించును. అట్టి కాముని జయించుట శివునకు మాత్రమే సాధ్యమయినది. అదియు తాత్కాలికముగ మాత్రమే. అమ్మవారి సౌందర్యము శివునిలో కామము కల్గింపజేయలేక పోవుటయే శివుని మన్మథదాహము. నిర్గుణ శివునకు కామరాహిత్యము శాశ్వతము. సగుణేశ్వరునకది తాత్కాలికము, తాద్దేశికము. ఈశ్వరుడనగా మాయాశబలబ్రహ్మము. ఆయనకు మాయతోడి సంపర్కమున సృష్టికర్తృత్వమేర్పడినది. మాయాస్వరూపిణియైన కామాక్షీదేవి కన్నులలోని అనంగ తంత్రము యొక్క మహిమయది. ఆమె కన్నులలోని శృంగార విలాసములకు శివుడు బానిసయైనాడు. తనను దహించిన శివునిపై అమ్మవారి కన్నులలో దాగియుండి కాముడు అదను చూచి శివుని జయించినాడు. మన్మథుడు శ్రీ విద్యా ప్రభేదములలోని కాది విద్యకు ద్రష్ట. త్రిపురోపనిషత్తులో నొక మంత్రమున కాదివిద్య ఉద్ధరింపబడినది. ఆ మంత్రమిది. "కామోయోనిః కమలా వజ్రపాణిః గుహాహసా మాతరిశ్వాభ్రమింద్రః పునర్గుహా సకలామాయయాచ పురూచ్యేషా విశ్వమాతాదివిద్యోమ్" ఈ విద్యయందు మూడు కూటములు కలవు. అందు రెండవ కూటమునకు కామరాజకూటమనిపేరు. హాదివిద్యాదులు కూడ శ్రీ విద్య ప్రభేదములే. వానిలోని ద్వితీయ కూటమునకును కామకూటమనియే పేరు. శ్రీవిద్యా సంప్రదాయములోని కామమునకున్న స్థానమిది. ఇంతేకాదు శాక్తేయ సాంప్రదాయమున శివునకు కాముడు, కామేశ్వరుడు అను పేర్లు కూడా కలవు. అతని దేవేరి కామేశ్వరి. ఆమెయే ఈ కామాక్షి. కామునకు చెఱుకుగడ విల్లు, పూలు బాణములు కలవనుట కవిసమయము కాని మన్మథుడు తన యుపాస్య దేవతయైన కామాక్షీదేవి

యొక్క సారూప్యము ధరించి యామెనుపాసించెను. ఆమెయను గ్రహమున ఆ సారూప్యమే ఆతనికి శాశ్వతమయ్యెను. ఉపాసనాకాలమున "నారుద్రోరుద్రమర్చయేత్ నావిష్ణుర్విష్ణుమర్చయేత్" ఇత్యాది సూక్తుల ననుసరించి యుపాస్య దేవతారూపమువంటి రూపమునుధరింపవలెను. అందుకే శివోపాసకులు భస్మరుద్రాక్షలు ధరించెదరు. విష్ణూపాసకులు తులసీమాలోర్ధ్వ త్రిపుండ్రముల ధరించెదరు. అందుచేత కామేశ్వరీ యుపాసకుడైన కాముడు వానిదరించి యామెనుపాసించెను. సచ్చిదానందము లీశ్వరునికి స్వరూపములు. అమ్మ వారీశ్వరి. కావున ఆనందమామె స్వరూపము. ఆమె శరీరమంతయు నానందఘనమే. కన్నులు ఆ ఆనందము చేతనే చాపల్యము తగ్గించుకొని మెల్లగా కదలుచున్నవని కవి వర్ణించినాడు. మెల్లగా కదలినప్పుడెక్కువకాలము తనపైనవి ప్రసరించుచుండునని కవి భావము. ఆమె కన్నులా కర్ణాంతములు. పెద్ద కన్నులలోని చూపులు మెల్లగా కదలినపుడు తనపై నెక్కువకాలము ప్రసరించుటనే విశ్లేషించి తెల్పుటకే కన్నులకు తాడిత కర్ణసీమ్నా మను విశేషణమును కవి కూర్చినాడు. జగమంతయు ఆ తల్లి చూపుల విలాసమే. ఆ చూపుల ఆటయే. ఖేలతియను క్రియాపదమీ యంశమును స్పష్టమొనర్చు చున్నది. బేసి పాదములు నామంతములు. సరిపాదములు ణా మంతములు అగుటచే నీ శ్లోకమున అంత్యానుప్రాసము కలదు.

4. కల్లోలితేన కరుణారసవేల్లితేన
కల్మాషితేన కమనీయ మృదుస్మితేన
మామంచితేన తవకించన కుంచితేన
కామాక్షి! తేన శిశిరీకురు వీక్షితేన

అ|| కామాక్షి! - ఓ కామాక్షీ దేవీ!, కల్లోలితేన - తరంగితమైన, కరుణారస వేల్లితేన - కరుణారసముచే పొంగిన, కల్మాషితేన - కలంకము కూర్పబడిన, కమనీయ మృదుస్మితేన - మనోహరమైన చిరునవ్వుగల, అంచితేన - గొప్పనైన, కించనకుంచితేన - కొంచెము వంచిన, తేన - ఆ, వీక్షితేన - చూపు చేత, మాం - నన్ను, శిశిరీకురు - చల్ల బఱుపుము.

తా|| అమ్మా! నీ శరీరమొక కరుణాసముద్రము. కన్ను అందలి తరంగమువలె నున్నది. అందు దయారసము పొంగుచున్నది. ఆ కన్ను కొంచెము వంగి యున్నది. అదిచూచువారికి పూజింప దగినదిగా తోచును. అందు అందమైన మందహాసము చిందులు త్రొక్కును. దానికి కాటుక దిద్దబడియున్నది. అట్టి నీ కంటి చూపుతో సంసారతాపతప్తుడనైన నన్ను చల్లబఱపుము.

వి|| శ్రీశంకరులమ్మ వారిని జయతి కరుణా కాచిదరుణా అని కరుణా స్వరూపిణిగా పేర్కొన్నారు. శ్రీలలితాసహస్రనామ స్తోత్రము *కరుణారససాగరా* అని పేర్కొన్నది. ఈ రెంటినీ కలిపి మూకమహా కవి అమ్మవారి కంటిని కరుణారస సముద్ర మందలి తరంగముగా పేర్కొన్నారు. అమ్మవారి కన్నుల యందలి ఆరుణ్యము కారుణ్యమే. ఆ కన్నుల యందు కాటుక రేక తీర్చబడినది. అది కన్నులలోని సహజమైన నైల్యమునకు మరింత వన్నెబెట్టుచున్నది. ఆ కన్నులయందు మందహాసము దోబూచులాడు చున్నది. అది ధావల్యమును బెంపొందజేయుచున్నది. సృష్టిస్థితిలయ హేతువులైన రజస్సత్త్వతమస్సులకు ఆరుణ్యనైల్య ధావల్యములు ప్రతీకలు. సృష్టిస్థితులేకాక లయముకూడ అమ్మవారి కరుణా కృత్యమే. లయము లేనిచో సృష్టియే యుండదు. సృష్టిలయ పూర్వకమని ధ్రువం జన్మమృతస్యచ అను గీతా వాక్యము సిద్ధాంతీకరించి చెప్పినది. అమ్మవారి సంపూర్ణ దృష్టిని కోరుట అత్యాశయమగునేమో కొంచెము వంగిన దృష్టియైన (అనగా కరుణ లేశముగలచూపు) చాలునని అదియే లౌకికాలౌకిక సర్వసుఖముల నొసగ సమర్థమగునని అమ్మవారి కరుణా ప్రభావాతిశయము వర్ణించుటకు కరుణగల కడగంటి చూపుచాలునని కవి చెప్పుచున్నాడు. దక్షిణ భారత భాషల వారి కవిత్వములో వర్ణమైత్రియను నామాంతరముగల వళికి ఆదరము హెచ్చు. కావున వారు ప్రాంతీయములైన తమభాషల కవిత్వములలో దానిని నియతమొనర్చిరి. దాక్షిణాత్య కవులు వ్రాసిన సంస్కృత కవిత్వములలో నియత మొనర్పకున్నను దానిని పుష్కలముగా ప్రయోగించిరి. ఈ శ్లోకమున 1-6 వర్ణములకు మొదటి రెండు పాదములలో మైత్రి కూర్ప బడినది. మొత్తము 11 పదములలో 8 పదములు తేన అను నక్షరములతో ముగియుటచే పదాంతాను ప్రాపము కలదు. కల్లోలిత యను విశేషణము

తరంగములను; కరుణారసవేల్లిత అను విశేషణము జలాధిక్యమును; కల్మాషితయను విశేషణము సముద్రములోని కాలకూట విషమును, కమనీయ మృదుస్మితయను విశేషణము సముద్రములో జనించిన చంద్రుని ధ్వనింపజేయుటచే విశేష్యమైన వీక్షితమునకు సముద్రముతోడి సామ్యము ధ్వనిత మగుచున్నది.

5. సాహాయ్యకం గతవతీ ముహురర్జునస్య
మందస్మితస్య పరితోషిత భీమ చేతాః
కామాక్షి! పాండవచమూ రివ తావకీన
కర్ణాంతికం చలతి హంత కటాక్షలక్ష్మీః

అ|| కామాక్షి! - ఓ కామాక్షీదేవీ, ముహుః - మాటి మాటికి, అర్జునస్య - తెల్లనైన (అర్జునునకు), మందస్మితస్య - చిరునవ్వునకు, సాహాయ్యకం - తోడ్పాటుగా, గతవతీ - వెళ్ళిన, పరితోషిత - సంతోషపెట్టబడిన, భీమ - శివునియొక్క (భీమునియొక్క), చేతాః - చిత్తముగల, కటాక్షలక్ష్మీః - కడగంటి కాంతి, పాండవచమూరివ - పాండవసేనవలె, తావకీన కర్ణాంతికమ్ః - తావకీన - నీ, కర్ణ - చెవులయొక్క (కర్ణునియొక్క)ః, అంతికమ్ - దగ్గఱకు, చలతి - కదులుచున్నది, హంత - ఆహా!

తా|| ఈ శ్లోకమున అమ్మవారి కాంతి పాండవసేనతో పోల్చబడినది. అమ్మవారి కడగంటి కాంతి మాటిమాటికి తెల్లని చిరునవ్వునకు సహాయముగా వెళ్ళుచున్నది. ఎట్లు? పాండవసేన అర్జునునకు సహాయముగా వెళ్లినట్లు. అమ్మవారి కడగంటి కాంతి శివుని చిత్తమును సంతోషపరచు చున్నది. ఎట్లు? పాండవసేన భీముని చిత్తమును సంతోషపఱచినట్లు. పాండవసేన కర్ణుని దగ్గఱకు వెళ్ళినట్లు అమ్మవారి కడగంటి కాంతి చెవిసమీపమునకు కదలుచున్నది. అమ్మవారి కటాక్షములు చిరునవ్వు చిందించునవి. కర్ణాంతమును చేరునంత విశాలములైనట్టివి.

వి|| అర్జున, భీమ, కర్ణ పదములు శ్లిష్టములు. కావున శ్లేషాను ప్రాణితో పమాలంకారము కలదు. తకార వర్ణావృత్తి యుండుటచే వృత్త్యను ప్రాసాలంకారమను శబ్దాలంకారమిందు కలదు. కటాక్షలక్ష్మి కర్ణుని దగ్గఱకు

